శ్రీనివాసశ్శరణమ్.

# విజ్ఞప్తి.

శ్రీమదనంతకోటి బ్రహ్మాండమధ్యస్థితైక బ్రహ్మాండాంతర్గత చతుర్దశ భువనమధ్యగత భూలోకస్థిత భరతఖండాంతర్వర్తి సేతుశీతాచలమధ్య ప్రవహత్కృష్ణా కావేరీ మధ్యదేశ శ్రీముద్గశికా నద్యుదీచీ తటానతిదూరస్థిత విప్రవిశాలసాల పురవాసి భూసురబృందంబునందు ఆర్వేలకుల తిలకులును యజుర్వేదీయులును ఆపస్తంబసూత్రులును బొమ్మరాజాన్వయులును శ్రీరంగనగరస్థిత శ్రీరంగనాథ కరకమల లాలిత శ్రీకూరేశపుత్ర శ్రీమద్హారీత గోత్ర శ్రీవైష్ణవ శ్రీమత్పరాశరభట్టరార్యవంశీయ చరణనళినసమాశ్రయణపరాయణులును నగు బొమ్మరాజామాత్యులకు నరసయామాత్య, లచ్చయామాత్య, పర్ణశాలామాత్యులను ముగ్గురు తనయులు గలిగిరి. అందగ్రజుండగు నరసయామాత్యునకు సత్పుత్రుండగు జోగిరాజామాత్యునకు జన్నప్ప, మూర్తెన్న, పద్మనాభయ్య, నరసింహం, సుందరరామయ్య, పర్ణశాలలనువారు జనించిరి. అందుమహా

ప్రాజ్ఞులు విద్వాంసులునగు మూర్తెన్నగారి- తాతయ్య, శ్రీనివాసులనువారు పుత్రులై లౌకికపారమార్థిక విద్యలందు ప్రవీణులై వెలసిరి. అందు శ్రీనివాస సుధీమణికి వెన్నెల కంటి వంశ సంజాతయగు రామలక్ష్మమ్మయను మహాసాధ్వికి నరసింహం, మూర్తెన్నలను సత్పుత్రులుదయించిరి. ఈ గ్రంథకర్తయగు శ్రీనరసింహముగారు శాలివాహనశక ౧౭౫౧ సం॥ర॥ మునకు సరియగు విక్రమసంవత్సర ప్రాంత మున జనించినట్లు తెలియుచున్నది. మహాపురుషలక్షణుం డగు శ్రీనరసింహముగారు బాల్యమునందే సంస్కృతాం ధ్రవిద్యలనభ్యసించి మాతులపుత్రికయగు వేంకమాంబను వివాహమై శ్రీరంగనగర నివాసులగు శ్రీపరాశరభట్టరు వంశీయ శ్రీమదళహాశింగరు భట్టరయ్యవార్లంగారి సమాశ్ర యణమున పంచసంస్కారములుబడసి శ్రీమాన్ విక్కిరాల శేషాచార్యులుగారి సన్నిధిని శ్రీ భాష్యప్రముఖోత్తమ గ్రంథసేవనమాచరించి, తదనుగ్రహాలబ్ధమగు శ్రీనివాస మంత్రమును జపించుచు శ్రీరంగనాయకశతక, శ్రీరామశతక ములను, జితంతేస్తోత్ర, యతిరాజ పంచవింశతినామక గ్రంథాంధ్రీకరణములను, భగవన్నామ సంకీర్తన గేయము లను రచించి సర్వకాలంబులందును నామసంకీర్తన శ్రీభా గవతాదిగ్రంథ పారాయణాదులను జరుపుచు, శ్రీరామో త్సవ, శ్రీకృష్ణోత్సవ, హరివాసర, పునర్వసుప్రముఖ పుణ్య

ప్రతి దినంబులందు భాగవతబృందంబు మృష్టాన్నసంతృప్తుల జేయుచు భగవద్భాగవతకైంకర్యధురీణులై భాగవతాగ్రేసరులై శ్రీరంగ, కరిగిరి ప్రముఖ దివ్యదేశయాత్రలు, కావేర్యాది పుణ్యనదీతీర్థ సంసేవనము సేయుచు, అనేక జన్మవాసనా పరంపరాగతాజ్ఞానతమోంధీభూత చేతనబృందమును భగవన్నామ సంకీర్తన శ్రవణాంజనముచేత ప్రబుద్ధులనుగా జేయుచు శాలివాహనశక ౧౭౬౧ వర్షంబులకు సరియగు రక్తాక్షి సం॥రం చైత్ర బ ౨ లు పుణ్యదినమున శ్రీనివాస స్మరణముతో శ్రీవైకుంఠ మలంకరించిరి. అమ్మహానుభావునేకపుత్రుండు వేంకటరంగయ్య శైశవదశయందుండిన హేతువుచేత తత్కృతగ్రంథములు సురక్షితములు గాకపోవుటయు, దైవవశమున శేషించిన తాళపత్ర గ్రంథములను శోధింపగా పైవానిలో శ్రీరామశతకమును, కొలంది గేయములునుదక్క దక్కంగల గ్రంథములు లభించినవి.

ముముక్షుజన కల్పవృక్షంబులనదగిన యీ గ్రంథరత్నములను బ్రకటించి భాగవతోత్తముల కందించి తదనుగ్రహ పాత్రులగుట తత్పౌత్రులకు విధియని హిత, గురు, బంధు, వర్గంబానతీయుటచే వారకార్యంబునకుగడంగిరి.

నరసింహదాసుగారు విద్వత్కవులు. వీరికవనము ద్రాక్షాపాకము. పదమధ్యయతులుగలిగి పద్యములు, పాటలు,

శ్రవణసుఖములుగానున్న యవి. త, ద, డ, లకు మైత్రికూర్పబడినది. వ్యాకరణ విరుద్ధములుగదోచు ప్రయోగములందందత్యల్పముగ గలవు. అయ్యవి యథామాతృకముగనే యుంపబడినవి. వీరిజితంతే స్తోత్రాంధ్రీకరణము ప్రత్యేకముగ ప్రకటింపబడ నున్నది. ఏతద్గ్రంథరాజమును బఠించి శ్రీరంగనాథదివ్యకృపాపాత్రులై గ్రంథప్రకటనకర్తలును, నరసింహదాసుగారి పౌత్రులును, చిరంజీవులునునగు, శ్రీనివాసులు, ఆంజనేయులు, రాఘవయ్యగార్లను శ్రేయోభివృద్ధిగ నాశీర్వదింతురని భాగవతోత్తములకు అంజలి ఘటించుచున్నారము.

బ్రాహ్మణ నిడుమానూరు,
(ఒంగోలు తాలూకా)
ప్రజోత్పత్తి వైశాఖ బ౧౩
గురువారం.

ఇట్లు భగవద్భాగవత విధేయులు
బొమ్మరాజు పురుషోత్తమదాసుఁడు
బొమ్మరాజు జానకిరామదాసుఁడు.

# శ్రీ యతిరాజస్తవం

కం॥ శ్రీశైలనాథ దివ్య కృ
పా శరణుని జ్ఞానభక్తి • భవ్యగుణపయో
రాశిని యతీశ్వర ప్రవ
ణాశయు మణవాళ మౌని • ననిశముగొలుతున్.

ఉ॥ ఏయనఘుండు శ్రీయతివ • రేంద్రుని సమ్యగనుగ్రహప్రదం
బౌ యతిరాజవింశతి స • మాఖ్య జెలంగు నుతిన్ సదానుసం
ధేయముగా రచించెను సు • ధీజనచాతక నీలమేఘుడై
శ్రీయుతుడైన యట్టిముని • శేఖరు సౌమ్యవరాఖ్యు గొల్చెదన్ 1

ఉ॥ శ్రీవిభు పాదపద్మయుగ • సేవలొనర్చుచు సంతతంబు ప్రే
మావిల చిత్తుడై తగ ప • రాంకుశమౌనికి పాదభక్తుడై
పావనపాద సంశ్రితుల • పాపములెల్ల హరించునట్టి రా
మావరజాఖ్యుడౌ యతికు • లాగ్రణి నే ననిశంబు గొల్చెదన్. 2

చ॥ అనిశము రంగనాథచర • ణాబ్జములన్ విహరింప హంసమై
మునికులరాట్పరాంకుశస • ముజ్జ్వలపాదసరోజభృంగమై
ఘనతర భట్టనాధ పర • కాలముఖాంబుజ భాస్కరోదయం
బన దగి కూరనాధునకు • ప్రాపకుడౌ యతిరాజు గొల్చెదన్. 3

చ॥ యతికులసార్వభౌమ భవ • దంఘ్రిసరోజయుగంబె భక్తిచే
సతతము వాఙ్మనః క్రియల • సాధుగతిన్ భజియించి ప్రేమసం
భృతులగు కూరనాధు కురు • కేశ్వర ముఖ్య పురాతనార్యసం
తతిచరణాబ్జసేవ నిర • తంబుగ దాసునకబ్బుగావుతన్. 4

ఉ॥ తావకదివ్యమూర్తినిఁ • దాస్కృతిసేయునునాదుచిత్తమో
దేవమదీయవాణి భవ • దీయగుణావళులెన్నఁగాక నా
నావిధకాయవృత్తులుఘ • నంబుగమీపదదాస్యకృత్యమా
గావుతనాదువాఙ్మన • కాయములన్యముఁబేడుగావుతన్. 5

చ॥ వరతిరుమంత్రరాజమున • వర్తిలునట్టి పదత్రయార్థసు
స్థిరపరమార్థనిష్ఠఁదయ • సేయుము శ్రీయతిరాజచంద్ర స
త్పురుషనిషేవణీయపద • తోయజయుగ్మము సేవఁజేయుచున్
నిరతమునాదుబుద్ధిమహ • నీయసుఖంబులభించుగావుతన్. 6

చ॥ యతివరమీపదాబ్జములఁ • యందుననించుకభక్తిలేదునా
కతిశయశబ్దముఖ్యవిష • యానుభవేచ్ఛజెలంగెనిట్టి దు
ర్గతికిమదీయ పాతకమె • కారణమన్యములేదుగాన నం
చితమతినీవెదానినిర • సించుమివేగదయాపయోనిధీ. 7

ఉ॥ శ్రీయతినాథ మానుష శ • రీరధరుండను వృత్తిచే పశు
ప్రాయుఁడ,నిట్టినేనుప్రసుతి • రమ్యశమాదిగుణాఢ్యుడోయనన్
మాయిక వేష మొప్పబుధ • మండలితోడమిథఃప్రసంగముల్
జేయుచునుంటినేటికిని • శిష్టజనాగ్రణిరామసోదరా॥ 8

చ॥ అనిశము నేనుదుఃఖ నివ • హంబొనరించెడిదుష్టచేష్టితుం
డను, విషయేచ్ఛగల్గి శర • ణాగత సంజ్ఞదనర్చువాడనే
ర్పునభవదంఘ్రిభక్తియుతు • వోలె విశిష్టజనాళిలోన నే
ఘనునిగసంచరింతునటు • గావునమూర్ఖుడనోయతీశ్వరా.

చం॥ నిరతముమంత్రదాయిగురు • నిన్ తిరుమంత్రమునున్
తదీశ్వరున్
వరమతిగొల్వకేపరిభ • వంబొనరించుచు భీతిలేక యీ

సరసిశయుండనయ్యునతి ♦ శాంతునిరీతి భవజ్జనాళిలో
మురియుచునుందుగాన, నతి♦మూర్ఖుడనోయతిరాజశేఖరా.

ఉ॥ మానసవాచకక్రియల ♦ మాటికినేత్రివిధాపచారసం
తానముస్వేచ్ఛగా నవిర ♦ తంబునుజేయుదునట్టినేనికెం
తైనను మీకునప్రియుడ ♦ నైప్రియురీతిగకాలయాపనం
బూనియొనర్తుగానయతి♦పుంగవమూర్ఖుడనైతినయ్యయో.

చం॥ దురితముసేయుచోభయము ♦తోనను తాపములజ్జయుణ్ మది¦-
స్థిరముగగల్గెనేని మరిసేయఁగ నొల్లఁడుపాపముల్ విమో
హరతుడనైన నాకటు భ ♦ యాదిలవంబును లేదుగాన నే
బొరిబొరిసంతతంబునఘ♦పుంజము సేయుదునోయతీశ్వరా.

చం॥ వరగుణసాగరాసకల ♦ వస్తువులణ్ వెలిలోననుండు నీ
శ్వరు గన నేరనైతి నొక ♦ వస్తువుగాన ని యంధుపోల్కినే
స్మరశరవశ్య మానసుడ♦సంతతమయ్యెదనయ్యయో భవ
చ్చరణము జేరికొల్వుటకు♦చాలననర్హుడనోయతీశ్వరా॥18

చం॥ త్రివిధములయిన పాపముల♦తివ్యథజేయగదుఃఖనయ్యునే
నవిరత దేహసంస్థితినె ♦ ప్రార్థనఁ జేయుచుపీడనొల్లనీ
వ్యవహృతికస్మదీయదురి ♦ తాఘమె హేతువుగాననీవెదా
నివిలయమొంద జేయుకరు♦ణించియతీంద్రదయాపయోనిధీ.

చం॥ అనుపమవాగగోచరమ♦హాగుణసంభృత దేశికోత్తముం
డనదగు కూరనాథుడున♦యంబుగబల్కినవైచ్యవృత్తి కే
ననిశముపాత్రభూతుడ మ ♦ దన్యులు లేరికనెందుగాన నీ
ఘనకృపయేమదీయగతి♦గావుములక్ష్మణయోగిపుంగవా।15

చం॥ అమలతరాత్ములై వెలయు • యామున దేశిక కూరనాధస
త్తమ వరభట్టరార్యులు ప•దంపడి పల్కిన నైచ్యమెల్ల సాం
ద్రముగను దాసునం దను•గతంబగు నేటికి గావునన్ గురూ
త్తమ యతిరాజ నీకృపయె • దాసుని కెప్పుడు ప్రాపకంబగున్ ।16

ఉ॥ ప్రాకృతవస్తుభోగముల • పైబడు మానుక వాంఛ నష్టమా
గాక భవత్కృపన్ సకల • కాలము తావక దాసదాస సం
ఖ్యాకలనంబులోస చర•మావధి దాసుని దాస్యవాంఛయే
నాకు లభించుగావుత ఘ•నంబుగ నెయ్యెడ సంయమీశ్వరా ।17

చం॥ శ్రుతినిచయానువేద్య పరి•శుద్ధగుణాంచిత దివ్యరూపసం
యుతుఁడగు రంగనాథుడు స•మున్నతిగన్ వచించి నీకు వశ్యుడౌ
కతమున నీవు దాసజన• కల్మషముల్ హరియించి బ్రోచు శ
క్తతగలవాడవంచు నిర•తంబును నమ్మితినో యతీశ్వరా ।18

చం॥ యతివర సర్వకాలముల•యందు మనోవచనక్రియాళిచే
నతిదురితంబొనర్చు ప్రజ • నావళి నెల్ల పరేశుడోర్చుటే
గతియగు నాక్షమాపణ సు • ఖస్థితి శ్రీరమణీశునొద్ద జే
సితివట నీవె దాననగు • సేవకకోటికి నెల్లసేమముల్ ।19

ఉ॥ శ్రీలసదార్యవంద్య యతి•శేఖర మీపదపద్మసేవ శ్రీ
శైల వరేశమాని విల • సత్కృపచే ఘటియించె గాన నె
వ్వేళలనట్టిసేవకడు • వృద్ధిగ దాసుని కందజేయుమీ
చాలగ తద్విరుద్ధముల • చయ్యెన బాపుము దేశికోత్తమా ।20

ఉ॥ నేమరు నీకు మ్రొక్కుచును • వేడితి నా మొఱ యాలకింపుమో
సామియతీంద్రశేఖర స • త్కరుణాకర భాష్యకార వి
డేమి యెఱుంగ డాత్మగుణ • హీనుడు దాసుడు రక్షకాంతరం
బేమియు లేనివాడనుచు • నెంచి కటాక్షముచేత బ్రోవవే ।21

చ॥ శ్రుతిమధురంబులై దనరు • సూక్తులచేనిటుసన్నుతింపుచున్
యతికులసార్వభౌముని ప్ర • హర్షమునొందగ సేయుసత్కృపా
యుతుడగునట్టిసౌమ్యవర • యోగినిగొల్చుచుసంతతంబు నా
మతినతులప్రసాదమున • మగ్రగతిన్ లభియించుగావుతన్॥

చం॥ సతతము రంగ భట్టగురు • సత్తము పాదసరోజయుగ్మసం
శ్రితుడగు వాత్స్యవంశజన్ము • సింహసమాహ్వయదాసుడార్తితో
యతిపతి వింశతిస్తుతిని • నాంధ్రవచః కృతి జేసెదానినం
చితమతిచిత్తగింపుడి వి • శిష్టజనాగ్రణులెల్ల సత్కృపన్॥



# శ్రీ రంగనాయక స్తవం.

ఉ॥ శ్రీశముకుందవామనహ • రీమధుసూదన శ్రీధరాహృషీ
కేశ, జగన్నివేశ, పర • మేశ, జనార్దన, దుష్టమర్దనా
కేశవ, గోపికారమణ • కృష్ణపరాత్పర, వాసుదేవగా
రీశసమర్చితాంఘ్రియుగ • ళీశుభదాయకరంగనాయకా॥

ఉ॥ చారువికుంఠధామ, ముని • సన్నుతతారకనామ, గోపికా
జారలలామ, రాత్రిచర • సంచయభీమ, సమగ్రకామ, శృం
గారరసాభిరామసుర • కైరవసోమ, యపారఘోరసం
సారవిరామ, భక్తవర • సంఘవిధేయకరంగనాయకా॥ 2

చం॥ లలితమ[illegible]మయూాద్భుతక • లాప; కలాపరిపూర్ణసుందరో
ల్లలదలకాంచితాననక • లాప; కలాపవిభాసితాళిమం
డలజయశీల కుంతలక • లాపకలాప; హతారిభూప, కో
మలకమనీయరూపసుర • మౌనివిధేయకరంగనాయకా॥ 3

చం॥ శ్రుతినిచయానువేద్య పరి • శుద్ధవియత్తటినీజనుర్నిదా
నతగలనీదుపాదనళి • నంబులుగొల్వగలేక పాపదు
ర్మతినయియుంటినింతనుక • మామకపాతకముల్ హరించినీ
పతితజనావనాంకముధ్రు • వంబుగజేయుమురంగనాయకా॥4

ఉ॥ పాపులలోన నేమొదటి • పాపుడనంచు సమస్తపాపముల్
బాపెదు వాడవంచుమది • పల్కరు నీపదపద్మయుగ్మమే
ప్రాపుగనమ్మితిన్ ఘనకృ • పామతిగావగదయ్య వైభవో
ద్దీపితదివ్యసుందర సు • ధీజనగేయక రంగనాయకా॥ 5

ఉ॥ స్నానతపస్సమాధి జప • సంధ్య లొనర్పగనేరనిర్మల
ధ్యానము సేయనేర,విధి • తంబుగ నీపరతత్వనిర్ణయ
జ్ఞానమెఱుంగనేర, హరి • సర్వశరణ్యయటంచు నిన్నునా
మానసమందుదల్చెదను•మానివిధేయక రంగనాయకా॥ 6

చం॥ నిరతముభక్తిచేదలచ • నేగ దురాత్ముడ నాటచేతసం
స్మరణయొనర్తుమిమ్మునొక•మాటుహరీయనినాదువాక్కునన్
హరియనునీదునామశుభ• దాక్షరయుగ్మముసత్యమేనినా
దురితములన్నిబాపిదయ • తోనన్నుబ్రోవుము రంగ॥ 7

చం॥దురితచరిత్రుడంచుకృప•తోనన్నుబ్రోవకయుంటివేని యో
పరమపదేశ్వరా! పతిత • పావనసంజ్ఞ వెలుంగునట్టి నీ
బిరుదుకులోపమౌగనుక • వేమరు నాదురితంబులెన్నకే
నిరతముబ్రోవుమయ్యరిమ•యగుణాకరరంగనాయకా॥8

ఉ॥ తావకదాస్యదివ్యసుఖ • తత్పరులై తగువారి యిండ్లని
చ్చావిధికీట రూపమగు • జన్మమునెత్తిన మేలుగాకయ
న్యావసథంబులందు చతు • రాననజన్మమునైన లేకపో
గావుత,నాకునెన్నటికి • కంజవిలోచనరంగనాయకా॥ 9

ఉ॥ తీరగు రంగమందిరమె • దివ్య వికుంఠము నిర్మలామృత
స్ఫారకవేరకన్యవిర • జానదివైష్ణవులెల్ల నిత్యులా
సూరులుగా నమేయగుణ • శోభితరంగ విభుండవౌచునిం
పార వెలుంగు,విష్ణుడవ•నంతశయాహరిరంగనాయకా॥ 10

ఉ॥ ద్రావిడసూక్తులన్ నిగమ • తత్వరహస్యములెల్లదెల్పిమీ
పావనపాదయుగ్మమున • ప్రాభవనామముగాంచిచేతనో
జ్జీవనమూలమైదగు వి • శిష్టగుణున్ శఠకోపసంయమిన్
భావమునందుగొల్చెదకృ•పాగుణభూషణరంగనాయకా॥ 11

ఉ॥ ఉభయవిభూతినాథుడని•యొప్పగనామముచేతమించిమీ
శుభదజయధ్వజంబనగ • శోభిలిచేతనరక్షణార్థమై
యభయదమంత్రరాజము న•యంబుగఁ గొల్లలుజేయువైష్ణవ
ప్రభుఁడగులక్ష్మణార్యులకు•పల్మరుమ్రొక్కెద రంగ॥ 12
ఉ॥ సరసవచోమృతంబు విల• సద్విబుధప్రకరంబుగ్రోల భా
స్వరహారిదర్శనాంబునిధి• చాలఁగపొంగకుదృష్టిచక్రముల్
కరముభయంబు నొందకళ•లన్ ఘనమార్గమున న్వెలుంగు నా
వరవరమౌనిచంద్రుమది•పల్మరుగొల్చెద రంగనా॥ 13
ఉ॥ చారుభవత్పదాంబురుహ • షట్పదమాయితచిత్తుచేతనో
త్తారక దివ్యబోధ రవి•దారితఘోరతమోంధునిన్ జయ
శ్రీరమణీయుఁడౌ అళహ • సింగరిభట్టరుదేశికోత్తమున్
సారెకుగొల్చెదన్ విపుల•సారసలోచనరంగనాయకా॥ 14
ఉ॥ బాల్యమునందునీదుపద•పంకజముల్ గొలువంగనెమ్మదిం
బాల్యముమీరగామిముగ•నన్ గలిగెన్ నిరతంబునేత్ర సా
ఫల్యముగాఁగ జూడగల•భాగ్యములేదుఘనంబునైన చాం
చల్యముబాపినన్ తలప • చక్కఁగజేయుము రంగనా॥ 15
చం॥ అనవరతంబుదుష్ట విష•యార్థసమార్జనవాంఛమీరగా
కునటియుబోలెనందరికి • కూర్మియొనర్చుచుదుర్జనాళి మె
చ్చననుసరింపుచున్ బరవ•సంబుననుండెడుబుద్ధి నీదుపా
దనళినభక్తనుఁడదుగ•దయ్యతదేకత రంగనా॥ 16
ఉ॥ నీదు ప్రభావముస్ దలచి , నేనుసమర్థుడనేనుతింప, బ్ర
హ్మాదులువేదముల్ బొగడ • నంతముగల్గదుగాననీదుశ్రీ
పాదసరోజముల్ దలచి•పల్మరుమ్రొక్కెదవాసుదేవ దా
మోదరకేశవాచ్యుత న•మోభవతేయనిరంగ నా॥ 17

ఉ॥ చేయఁగనైన కార్యములు • సేయఁగనైతి నకృత్యముల్ సదా
జేయుచునుంటి దుర్మలిన • చిత్తుఁడనౌచు మహాపరాధముల్
చేయుచు నొనర్చితిన్ బరిభ • వించక నన్ను క్షమించుమయ్య నా
రాయణ యంచు నిన్ను హృద • యంబున వేఁడెద రంగనా॥ 18

ఉ॥ చారుసరోజవజ్రకులి • శధ్వజచామరకల్పకాది వి
స్ఫారవిశేషచిహ్నముల • సన్నుతికెక్కెడు నీమహాపదాం
భోరుహముల్ గనంగ మది • పుట్టెను వాంఛ యనుగ్రహించి యిం
పారఁగ జూపుమయ్య సుజ • నావన కస్తురి రంగనాయకా॥ 19

చం॥ సిరికి నిరంతరంబు కడు • సేవ్యము నై వరయోగిబృందహృ
త్సరసిజబాలభానుసదృ • శప్రభమై శ్రుతిసుందరీశిర
స్సరసవతంసమై కమల • చక్రముఖాంకవిరాజమానమై
మెఱయు భవత్పదాబ్జయుగ • మే మది గొల్చెద రంగనా॥ 20

ఉ॥ నీమహనీయమూర్తి కడు • నిర్మలభక్తిఁ దలంపలేక నే
పామరవృత్తిచేత బహు • భంగుల దుర్విషయాభిలాషలన్
వేమరు బొందుచుంటి నిక • వేగ భవత్పదయుగ్మమందునన్
బ్రేమ గలుంగఁ జేయుము హ • రీ శుభదాయక రంగనాయకా॥21

ఉ॥ దేహ మనిత్య మంచు మది • దెల్వి యొకింతయు లేక నిత్యమున్
మోహవశంబునన్ విషయ • ముల్ కడు భోగ్యములంచు నమ్మి
ద్రోహిని నన్ను దుర్గతికి • ద్రోచిన సద్గతిఁ జేర్చినన్ విరా [తిన్
డ్వాహన నీ వెదికుఁ సుర • వందిత సుందర రంగనాయకా॥22

ఉ॥ పారములేని దుఃఖసుఖ • భంగములన్ కడు నొచ్చి తృష్ణలన్
ఘోరభవాగ్ని వేదనల • కున్ భయమంది దురంతమైన సం
సారపయోధిమధ్యమున • నెబడియుంటి నీదు భక్తియన్
తీరగు నావచేత దరి • నెట్టుము నన్నిక రంగనాయకా॥23

చం॥ పతితుడనంటి పాపములు • బాపుమటంటి మహానుభావ యే
గతియిక లేక నీదుపద • కంజములే శరణంటి ఘోరసం
సృతిబడి యుండజాలక హ • రీకరుణించుమటంటి నన్ను నీ
గతిబడ జేయ నీబిరుదు • గాదు సనాతన రంగనాయకా॥24

చం॥ కనదవివేక మేఘములు • గ్రమ్మిదిశల్ గనరాక యుండగా
ననుపమదుఃఖవర్షముని • రంతరముల్ గురియన్ భవాఖ్యదు
ర్దినమున కాలుజారిపడి • తిన్ నను జూడగదయ్య యో కృపా
వననిధియచ్యుతా సుజన • వందిత మాధవ రంగనాయకా॥25

ఉ॥ గాత్రము నిత్యమంచు కడు • గర్వమునన్ దలపోసి ఘోరతా
పత్రయ వహ్నిచే గనలి • పల్కురుసంసరణాటవిన్ మహా
కృత్రిమమార్గమందు బడి • కేడునన్ను కృపాంచితాంబురు
ట్పత్రకటాక్షవర్షమున • బాగు గ్రోవుము రంగనాయకా॥26

ఉ॥ పన్నగశాయిభక్తజన • పాలనశీల యనాదిస్పష్టిచే
నెన్నగరాని యోనులన • నేకభవంబుల నొందుచున్ మహా
పన్నుడనైతి నన్నిక ను • బాముల బెట్టక మీపదాబ్జస
త్సన్నిధి జేర్చి బ్రోవవెస • దాశుభదాయక రంగనాయకా॥27

ఉ॥ ఘోరకృతాంత వేదనల • కున్ మది తాళగలేక మీపదాం
భోరుహ యుగ్మమే శరణు • బొందిన వాడ భవత్పదాశ్రయో
దారులరైన దాసులక • డాపటివానిగ నెంచి నన్ను నీ
చారుకృపాకటాక్షమున • చల్లగ బ్రోవుము రంగనాయకా॥28

ఉ॥ వాసిగ నాదుస్వప్నమున • వైష్ణవచిహ్నములన్ ధరించి కాం
తాసహితుండవై కడుము • దంబున వచ్చిన మిమ్ము గాంచి యెం
తేసులభుండ వంచు విను • తింపుచు మ్రొక్క గనష్టమం గళా
శాసన మొప్ప జేసితివి • సారసలోచన రంగనాయకా.29

ఉ॥ నీకరుణాకటాక్షమును • నీవికసద్వదనారవిందముఁ
నీకమనీయ విగ్రహము • నీజగదేకపవిత్రచర్యలన్
తేకువమీరఁగా నితర • దేవతలందునఁగల్గ నేర్చునే
నాకవిరోధినాశ యదు • నందన కేశవరంగనాయకా. 30

ఉ॥ శ్రీవిలసిల్లి నిత్యమగు • శ్రేయములియ్య సమగ్రమై జగ
త్పావనమై శ్రుతిప్రకర • భావ్యములై తగు నీదు సత్కథల్
భావనమీరఁగా వినెడు • భక్తులకున్ ప్రణమిల్లెదన్ సదా
భావజకోటిసుందర కృ • పారససాగర రంగనాయకా. 31

చం॥ కరివరుడార్తితోడ ననుఁ • గావు పరాత్పర యన్న దేవతో
త్కరము మొరాలకించియు స్వ•తంత్రత నేమి నియూరకున్న స
త్వరగతి వచ్చి గ్రాహముసు•దల్చి గజేంద్రుని గాచినట్టియో
పరమవికుంఠధామ నినుఁ • బ్రస్తుతిఁ జేసెద రంగనాయకా. 32

చం॥ అమృతమౌ జిలుకు తావక ప•దాంబుజమందు నభక్తిగల్గు న
త్యమలమనస్కుఁడన్యవిష•యంబుల నెట్టులఁ గోరు సన్మరం
దముగల నీరజంబున మ • దంబున నుండెడు తేటి గోల్మిడిన్
భ్రమపడి ముట్టఁబోవునె స • నందన వందిత రంగ॥ 33

ఉ॥ అందము గల్గు కుందనపు•టందెలు పాదములందు మ్రోయ తే
చందురు గేరు నెన్నుదుట • చక్కని కస్తురిబొట్టు గుల్కగా
సుందరమైన పిల్లసిగ • జుట్టును పింఛము జెన్ను మీర నీ
నందకిశోరరూపము గ • నన్ మనసయ్యెడి రంగ॥ 34

ఉ॥ ముద్దులుగుల్కు మోముపయి•ముంగురులిట్టిట్టు వ్రేలు
చుండఁబల్
నిద్దపు చెక్కులన్ ప్రతిఫ• లింప యశోద ముదంబునొంద మేల్

సుద్దులుబల్కుచుం భువన • సుందరరూపముగల్గునిన్ను నే
ప్రొద్దుమదిందలంచెద స • రోరుహలోచన రంగ॥ 35
చం॥మురళిరవామృతంబుకర • ముం వ్రజభూరమణీచకోరికల్
పరవశలౌచు కర్ణయుగ • పత్రములం గడుగ్రోలలోకసుం
దరదరహాసచంద్రిక మ • నంబలరారెడునీముఖాబ్జ మ
చ్చెరువుగఁజూపుమయ్య మది • సేవయొనర్చెద రంగ.36
ఉ॥ శ్రీరమణీవినోదములు • శ్రీదములంబుజగర్వనోదముల్
సారససంభవాద్యమర • చారు మనఃపరిపూర్ణమోదముల్
నారదముఖ్యబర్హిగణ • నవ్యపయోదములై చెలంగి సొం
పారెడునీదుపాదముల • నాత్మఁదలంచెదరంగనాయకా।37
ఉ॥రాజిలువిద్రుమంబుల ని • రాకరణంబొనరించెకాంతి ని
ర్వ్యాజతమించెకెంజిగురు • టాకులమొత్తమునుం నఖాంకుర
వ్యాజమునం హసించెజల • జావళినంబువులందుముంచెమీ
పూజితపాదపద్మముల • బోల్పగనున్నవె రంగనాయకా।38
చం॥సరసవచోవిలాసముల • చారుకటాక్ష విలోకనంబులం
మురళివినోదనాదముల • మోహితలైవ్రజకాంతలెల్లనిం
మఱగి పిఱుండవంచును మ • నంబునదాల్చియుముక్తులై రహో
యరుదుభవచ్చరిత్రము సు • ధాశనగేయక రంగనా॥ 39
ఉ॥ యామునసైకతాగ్రముల • యందునగోపికలెల్లగొల్వ లీ
లామయమూర్తివై కడుచెలంగుచు రాసమహోత్సవంబులం
వేమరుసల్పుచుం నటక • వేషముదాల్చి వేణువూదునీ
మోమిటుజూపవే భువన • మోహనసుందర రంగనా॥ 40
ఉ॥ కోమలిరాధమిమ్మురతి • గోరుచురాగనిబృందలోనయా
భామినికూడికుంజముల • ప్రాకృతమంజుల పుష్పశయ్యలం

వేమరు కామదేవుని బ్ర • వి స్తరసిద్ధులు గాంచినట్టియా
సీమహిమంబు లెవ్వరుగ • ణింపగ నేర్తురు రంగనాయకా।

ఉ॥ రంగవిహంగపుంగవ తు•రంగ కృపాకలి తాంతరంగ శ్రీ
రంగదపాంగ దివ్యముని • రాజమనోంబుజభృంగ నమ్రసా
రంగవరార్తిభంగ కమ•లారమణీహృదయానుషంగ స
న్మంగళభాసురాంగ శ్రుతి•మండలగేయక రంగనా॥ 42

ఉ॥ దానపులుర్ సుపర్వులమృ•తార్జనవాంఛ మహీధరంబు మం
థానముగా నొనర్చి ఫణి• నాథుసిరజ్జువు జేసి యప్పయోం
భోనిధి ద్రచ్చు భారమున• మున్గిన మందరగంబు మూపునన్
బూనిన కచ్ఛపాకృతి వి•భున్ నినుగొల్చెద రంగనా॥ 43

చం॥ పొలుపగునట్టి వారిచర • మూర్తి మహోద్భుత మొప్ప
[దాల్చియా
ప్రళయపయోధి మధ్యనుజ•లంబుల దాగిన సోమకాసురున్
బొలియగ జేసి తజ్జఠర • పూరిత భాసుర వేదపంక్తులన్
నలువకొసంగినట్టి నిను• నామది గొల్చెద రంగనా॥ 44

ఉ॥ ఘోరవరాహరూపమున • కుంభిని గైకొని పోయి నీరధిం
జేరిన హేమనేత్రు నిర•సించి రసాతలమందు నున్న యా
ధారిణి దంష్ట్రికాగ్రమున • దాలిచియెత్తిన యజ్ఞమూర్తి నిన్
సారెకు నాదు నెమ్మదిని • సన్నుతి జేసెద రంగనాయకా।45

చం॥ చటులతరాచ్ఛటీపటిమ• స్తంభమునందుదయించి రౌద్రవి
స్ఫుట నరసింహరూపమున • శోభిలి వజ్రనఖాంకురంబులన్
కుటిలతరాత్ము దైత్యకుల• కుంజరు వక్కలు చేసి తత్సుతున్
పటుగతి బ్రోచినట్టి నిను• ప్రస్తుతి జేసెద రంగ॥ 46

ఉ॥ ధారుణి దైత్యశైలశత • ధారము లాతతభవ్యసద్యశః
పూరములాననుద్దితిజ • పుత్రదృగుత్పల చారుచంద్రికా
సారములైన తావకల• సత్పరమాద్భుతకృన్నఖాంకురా
కారములాపదల్ దునిమి • గావుతమమ్ముల రంగనా॥ 47

ఉ॥ వామనమూర్తివై బలిని•వంచనమూడడుగుల్ ధరాతలం
బీమని వేడగానటుల • నిచ్చితినన్న పదద్వయంబునే
భూమియునాకసంబుసరి•పుచ్చి తృతీయపదంబునఁ బలిఁ
భూమినడంగఁద్రొక్కినవి•భుఁ నినుగొల్చెద రంగనా॥ 48

ఉ॥ ధారుణితీక్ష్ణమౌపరశు • ధారలనిర్వదియొక్కమార్లుగా
ధారుణినాథకంధరల • తాతతులుఁ దెగఁగోసి యర్జునో
దారమహీజముఁ దునిమి• తండ్రికి బ్రీతియొనర్చు భార్గవా
కారుని రామునిఁ గొలుతు • కంజవిలోచన రంగనా॥ 49

చం॥ దశరథరామచంద్రుడన • ధారుణిబుట్టియు తాటకఁ జగ
తుక్కశలముమీరజంపిముని •కుంజరుజన్నముగాచి శాపదు
ర్దశపడియున్నగౌతముని • రాణినినాతిని చేసిశంభువిల్
భృశగతిద్రుంచిజానకిని • పెండిలియైతివి రంగనా॥ 50

చం॥ అనుజుడు వెంటరాగజన• కాత్మజతో పితృవాక్యశాసనం
బునవనికేగియందు ముని • పుంగవులఁ గడుబాధసేయుదు
ర్దనుజ మృగంబులఁ బ్రదర • దారుణదావముచేతగాల్చి స
జ్జనములఁ బ్రోచితీవెగద• శౌరి రఘూత్తమ రంగ॥ 51

ఉ॥ జనకజఁగోలుపోయియను•జన్ముడుమీరుమహోగ్రకాననం
బునసతిజాడఁగ్రుమ్మరుచు•మూర్ఛిలియున్నజటాయుచే ప్రవ
ర్తనమొకకొంతయుఁ వినిప•దంపడిమారుతిచేతసూర్యనం
దనుసచివత్వమొందితివి•ధర్మవిధాయక రంగనాయకా॥ 52

ఉ॥ వాలిని నొక్క కోలఁబడ • వైచియు భానుజు కీశలోకభూ
పాలకుఁ జేసి యెల్లెడల • వానరులం బ్రియురాలి వార్తకై
చాలఁగ బంపి భవ్యగుణ • సాగరు మారుతసత్కుమారుచే
మేలగు సీతవార్త విని • మెచ్చిన ప్రోడవు రంగనాయకా॥ 53

చం॥ గిరిచర సైన్యకోటులనొ • గిం గొని సూరసుతుండు [మీరలం
శరనిధిఁ గట్టి దాటి చని • శాత్రవపట్టణ మాక్రమించి స
త్వరమున పుత్రబాంధవయు • తంబుగ సంగరభూమి రావణా
సురు బొరిగొన్న యట్టి జయ • శోభితమూర్తివి రంగనా॥ 54

ఉ॥ చండగుణారవ స్తనిత • సంయుతకుండలితాసపూనకో
దండఘనాఘనోచ్చలిత • దారుణశాత జవాంచితాద్భుతో
ద్దండశరోగ్రవర్షశమి • తస్ఫుటరావణ దావకీలు మా
ర్తాండకులీను రాము నిను • దల్చెద నామది రంగనా॥ 55

చం॥ ఉరుతరభక్తి మిమ్ము శర • ణొందిన యట్టి విభీషణుం దయం
చిరతర వైభవంబు పెల • సిల్లఁగ లంకకు రాజు చేసి భా
సురమతి సీతతోడఁ గడు • శోభిలి పుష్పక మెక్కి వానరుల్
బరువడి వెంటరా పురికి • వచ్చిన సామివి రంగ॥ 56

ఉ॥ ఆతత వైభవంబున స • మస్తజనంబులు సంతసింప సా,
కేతపురప్రభుండవయి • కీర్తి జగంబుల నిండ బర్వఁగా
సీత నిజాంకమందు విల • సిల్ల నిజానుజులెల్లఁ గొల్వఁగా
ప్రీతి వెలుంగు రాము నిను • ప్రేమ దలంచెద రంగనాయకా॥ 57

చం॥ ప్రవిమలచంద్రమూర్తి బల • రాముఁడనం జనియించి గోపికా
కువలయనేత్రలం లలిత • కోమలభవ్య కళానుభూతిచే

నవిరళమౌవికాసముల • నంగజకేళుల దేల్చినట్టి మా
ధవనిను నామదిందలతు • దాసవిధేయక రంగ॥ 58
చం॥ త్రిపురసురారికాంతలప•తివ్రతలన్ భ్రమియింపజేయగా
కపటములైనధర్మములు • కల్పనజేసి గిరీశుచేత నా
విపులబలాసురేంద్రులను • వేగమె చంపగ జేయునట్టి బౌ
ద్ధపతివి నన్నుగావవె స • దా శుభదాయక రంగ॥ 59
చం॥ కలియుగకాలమందుఘన•కల్మషపూరితులైన మ్లేచ్ఛవీ
రులు ధరయేలగా శ్రుతిని • రూపితధర్మములన్ని బ్రోవను
జ్జ్వలగతి కల్కిరూపమున • పాపుల నెల్ల నధించి ధర్మముల్
వెలయగ జేసితీ వెకద • వేదవిధాయక రంగ॥ 60
ఉ॥ వేదము లుద్ధరించి పృథి • వీధరమెత్తి ధరిత్రి నీటిపై
పాదుగ నిల్పి దైత్యవరు • వచ్చి బలీంద్రు గదల్చి రాజుల
నోర్చి దిదశాస్యు జంపి హల • మున్ ధరియించి విరుద్ధధర్మ సం
వాదమొనర్చు దుష్కులిని • వ్రక్కలు జేయవె రంగ॥ 61
ఉ॥ దోసములన్ని యున్ దొలగ • ద్రోసి కృపాకలితాంతరంగుడై
దాసుల బ్రోచువాడనుట • సద్దయు చిత్రమె ద్రోహియైన కా
కాసురుడార్తితో శరణ • మన్న ననుగ్రహబుద్ధి బ్రోచు నీ
భాసురసద్గుణావళులు • బల్కగ శక్యమె రంగనాయకా॥ 62
ఉ॥ తీరగు వేదశృంగముల • దీపితమై ప్రణవస్వరూపశృం
గారవిమానమందు నన • ఖండవిభూతి ఫణీంద్రశయ్యపై
శ్రీరమణీధరాంగనలు • జెన్నుగ బాదములొత్తుచుండ బా
ల్పారగ బరున్న యట్టి ప్రణ•వార్థవిభాసివి రంగనాయకా॥ 63
చ॥ నిరుపమసుందరాస్యమున • నీలపు కాంతి జయించి మించు ముం
గురులు జెలంగుచుండ పులి • గోరు మణీమయహారవల్లరుల్

ఉరమున వ్రేలఁగొమ్మెఱుఁగు•టొల్లియ మేన వెలుంగ నందమం
దిరమున నాడు గృష్ణునిను • నేఁగొనియాడుదు రంగ॥ 64

ఉ॥ నందునిమందఁ గల్గులల • నామణులన్ మఱగించి వారియిం
డ్లందున దూరి వెన్నలుర• యంబున మ్రుచ్చిలి సంగడీలతోఁ
పొందుగ మెక్కుచున్ భువన • మోహన బాలకమూర్తివై ననీ
యందము నాకుజూపవె మ•హామృత దాయక రంగనాయకా॥ 65

ఉ॥ వెన్నలదొంగవంచెఱిగి • వ్రేతలు పల్మరు విన్నవింపగా
మున్ను సనందనాది ముని• ముఖ్యులకైనను జిక్కరాని ప్రో
డన్నినుఱోలఁగట్టెనట • తల్లి యశోద తదీయ భాగ్యసం
పన్నత దల్పగావశమె• పద్మజుకైనను రంగనాయకా॥ 66

చం॥ అనుపమమైన నీ మొగము• నందము నీదగు మేని సొంపు నీ
ఘన కరుణాంతరంగితవి • కాసకటాక్షము నీదు లోకమో
హనతర చౌర్యనైపుణులు• నద్భుతచర్యలు విన్నయంతనా
మనమున కోర్కె పుట్టెనొక • మాటిటు జూపవె రంగ
నాయకా॥ 67

ఉ॥ కోమలకాంతియున్ మదన •కోటివిమోహన దివ్యసుందర
శ్రీమహనీయ వేషమున • చెన్నలరారెడి బాలకృష్ణ లీ
లామయమూర్తి నిన్నెపుడు•లాలన జేయుచు గాంచ గోపికా
భామల భాగ్యమే మనుచు • బల్కగవచ్చును రంగ॥ 68

ఉ॥ సంగడి గోపబాలకులు• చయ్యన నాయమునాతటంబునన్
పొంగుచు కేళిసల్పుచును • పొందుగ లేగలనెల్ల కాచుచున్
బంగరుసొమ్ములంగముల•భాసిల మోహనమూర్తివౌ జగ
న్మంగళ బాలకృష్ణునిను • నామది గొల్చెద రంగ॥ 69

ఉ॥ నిద్దపు కేలనవ్యనవ • నీతము జెన్నలరార మోమునన్
దిద్దినచుక్క బొట్టుపయి • నిన్వెలుగొందెడి రావి రేక యున్
ముద్దులుగుల్కు హారములు • బొజ్జపయిన్ చెలగన్ యశోద
కుందద్దయు బ్రీతిసేయు నిను • దల్చెద నామది రంగనా॥ 70

చం॥ ఇరవగునట్టి కాళియఫ • ణీంద్రఫణాఫణిమంటపంబునన్
సురుచిర కేళితాండవము • చోద్యముగానొనరించిమంజునూ
పురనినదంబులుల్లసిల • పొల్పగుమీచరణాంబుజంబులా
దరమతిజూప వేకడు ము • దంబున గాంచెద రంగనా॥ 71

ఉ॥ పుణ్యచరిత్రమైసుజన • పూజితమైవర సౌకుమార్యలా
వణ్యవిలాసమైలలిత • వైభవమైనవనీతచౌర్యమై
పుణ్యనిదానమైమిగుల • బొల్పగుయుష్మదపూర్వభాగ్యసౌ
గుణ్యముదల్తుసంతతము • గోపకుమారక రంగనా॥ 72

ఉ॥ మందనుగల్గుగోపిక లు • మాసతినోమగయామునోదకం
బందునస్నానమాడదరి • యందుననుంచినవారిచేలముల్
పొందుగదాంగిలించితట • భూజమునెక్కినముద్దుకృష్ణనీ
చందముజూపవేకనులు • చల్లగజూచెద రంగనా॥ 73

ఉ॥ ప్రాకటబర్హిబర్హముపు • రందరుచాపముగాగగార ల
క్ష్మీకమనీయచేలమల • మించులగుంపులుగాగ వేణురా
గాకలనంబుగర్జితము • గా ముదితవ్రజకామినీమణుల్
కేకినులట్లుగాగతిల • కింపవిలాసరసంబునించు మే
ఘాకృతినొప్పుకృష్ణనిను • నాత్మదలంచెద రంగనా॥ 74

ఉ॥ తీరగువామపాదమున • దీపితదక్షిణపాదముంచి యిం
పారెడువామభాగమున • నాస్యమొకించుకవంచివేణువున్

చారుతరోష్ఠమందునిచి • చక్కఁగ బాడెడుకృష్ణమూర్తిశ్రీం
గారమురూపమొందెనన • గాపొలుపొందవె రంగ॥ 75
చం॥ మురళిరవంబుగోపికలు • మోదముతోవినిబృందచేరరా
సరసమృదూక్తులఁ సలిపి • చయ్యనకఁ మొరగింపవారలుఁ
స్మరశరవిద్ధలైమిము వె • సఁ మొఱగఁ గరుణించిదివ్యసుం
దరతరమూర్తిజూపుచు ఘనంబుగఁ బ్రోవవె రంగనా॥ 76
ఉ॥ శీవిగ వేణుగానమున • డెందము మోదమునొందసాధుబృం
దావనభూములందుయము • నాతటినీతటులందు బాగుగా
గోవుల మేపుమీచతుర • గోపకుమారకమూర్తిచూపవే
శ్రీవసుదేవనందనవి • శిష్టజనావన రంగనాయకా. 77
ఉ॥ పూనియనేకజన్మముల • భూరితపంబునుజేసినట్టిసు
జ్ఞానులకైనగన్గొనగ • శక్యముగల్గనియట్టినీవురా
ధానళినేత్రుణాభుజల • తాపరిబద్ధుడవైతివౌరనీ
మానితచిద్విలాసమున • మానమహోహరి రంగనా॥ 78
ఉ॥ పావనమైననీదుపద • పంకజరేఖలజెన్నుమీరు బృం
దావనపుణ్యరాశియము • నానదిభాగ్యచయంబునందుగో
పీవర మందిరాంగణప • విత్ర చరిత్రము నెన్నశక్యమే
యా వనజోద్భవాదులకు • నైనను మోహన రంగ॥ 79
ఉ॥ నాశెముగల్గుము తియము • నాసికయందు జెలంగమంజుల
క్వాణములుల్లసిల్లుమణి • కంకణముల్ ధరియించిమోవిపై
వేణువునుంచిగానమును • వేడుకచేయుచుగోపకాంతలఁ
జాణతనంబునఁగవయు • చక్కనిసామివి రంగనా॥ 80
చం॥ నిరుపమకౌస్తుభంబుకమ • నీయవళిత్రయకంఠసీమపై
సిరులు నెసంగదివ్యతుల • సీదళదామముశ్రీ విలాసముఁ

దిరముగ పేరురంబుపయి • నిన్వేలుగొందగ నిత్యమంగళా
కరమహనీయమూర్తి నినుఁ • గాంచుట లెన్నఁడొ రంగనా॥81

ఉ॥ కూరిమిమీరగన్ మధుర • కుంగొనిపోవగ త్రోవలోన న
క్రూరుడు మున్న గాయమున • కున్ జననంబువులందు మీమహో
దార నిజస్వరూపమును • దంబుగ జూపిన భక్తవత్సలా
యేరికమిమ్ము బోలినస • మిద్ధకృపాత్ములు రంగనా॥ 82

ఉ॥ కొంకక కౌరవుల్ సభను • కోకలనొల్వగ "కృష్ణమాధవనా
థాంకిము పేక్షసే" యనిన • ద్రౌపదికక్షయ వస్త్రరాశిని
శ్శంకతనిచ్చినట్టివిల • సత్కరుణానిధి వౌరశక్యమే
పంకజసంభవాదులకు • ప్రస్తుతిసేయగ రంగనా॥ 83

ఉ॥ దేవకికిన్ జనించిజగ • తీభరమెల్లహరింపనందగో
పావసథంబుజేరిపర • మాద్భుతసుందరమూర్తివై జగ
త్పావన బాలలీలలున • పారముగా నొనరించి తౌరయో
శ్రీవనితామనోహరవి • శిష్టగుణాకర రంగనాయకా॥ 84

ఉ॥ పాతకులై జగంబులకు • బాధలొనర్చెడు పూతనాదులన్
ఖ్యాతిగజంపివత్సలను • గాయుచునందునికిన్ యశోదకున్
బ్రీతినొనర్చుచున్ ఘనచ • రిత్రుడవైతగు కృష్ణమూర్తిమీ
చేతలుదల్పగావశమె • శేషునకైననురంగనాయకా॥ 85

ఉ॥ రంజితమూర్తినీవుమధు • రాపురవీధులరాపురాంగనల్
మంజులనేత్రభృంగముల • మాటికిమీవదనాబ్జమాధురీ
పుంజముగ్రోలుచున్ మిగుల • పువ్వులుజల్లగ సంతసించితీ
విందెలువొందుమిమ్ముగన • వేడుకపుట్టెను రంగనా॥ 86

ఉ॥ దండిగబూజసేయునిజ • ధాముసుదాముడొసంగినట్టిపూ
దండలుచాలదాల్చిప్రమ • దంబునకుబ్జయొసంగుగంధమున్

మెండుగ మేనిపై నలది • మేలిమిబంగరు వల్వఁగుల్కఁగా
మండితమూర్తివైననిను • మాటికిఁగొల్చెద రంగనా॥ 87

చ॥ ఇభమునడంచిమల్లురవ • ధించి సమస్తజగంబుచూడగా
సభనసురేంద్రుఁగంసునివె • సఁలవమాత్రనెజంపి దేవతల్
నభమునఁబారిజాతసుమ • నశ్శుభవర్షమునించ నొప్పుమీ
శుభవిజయాంకమూర్తికడు • చోద్యముశ్రీహరి రంగనా॥ 88

ఉ॥ క్రూరజరాసుతాదిరిపు • కోటులపోరనదల్చి రుక్మిణీ
శ్రీరమణీలలామమును • జేకొనిస్యందన మెక్కిలీలతో
ద్వారవతీపురంబునకు • వచ్చిసమస్తజనంబు మెచ్చనిం
పారగఁబెండ్లియైనవిజ • యాహవమూర్తివి రంగనా॥ 89

ఉ॥ ఆతతనిత్యభూతిమహి • తాత్మవిభుండవు సర్వచేతనా
చేతనశేషి రూపుడవు • శ్రీకర దివ్యగుణాబ్ధి విందిరా
నేతవమేయనాయుడవు • నీమహిమంబు దలంపశక్యమే
ధాతకు పార్వతీపతికి • దాసవిధేయక రంగనాయకా॥ 90

ఉ॥ ప్రాపకచేతనావళికి • ప్రాప్యుడవద్భుతదివ్యభవ్య పం
చోపనిషన్మయానుపమ • శుద్ధశుభావహమూర్తివైననీ
రూపమువేదవాక్కులు ని • రూపణసేయగజాలవన్న నే
నోపుదునేతలంపగ మ • హోన్నతవైభవ రంగ॥ 91

చ॥ పరుడవువాసుదేవుడవ • పారవిభూతివెలింగి ప్రాకృతా
వరణవిహీనమైమదికి • వాక్కులకుఁగనరానిదై యజా
మరులకు బొందరాని పర • మాంబరసీమవికుంఠధామమం
దిరవుగనున్న నిన్బొగడ • నెవ్వరి శక్యము రంగ॥ 92

ఉ॥ నీయధికాజ్ఞచేవడి న • నేక సరోజభవాండకోటులన్
జేయగ బెంపగానమయ • జేయగఁజాలి గుణస్వరూపవై

యేయెడ నంతు లేనిదయి • యెన్న గదై వియనంగ నొప్పు నీ
మాయకు వందనంబు పలు • మారు నొనర్చెద రంగ॥ 93

ఉ॥ ఆయత సత్వరూప చతు • రాత్ముడవై వర యోగిబృందహృ
ద్ధ్యేయుడవై సమస్త జగ • తీవర నాశుడవయ్యు పంచ మో
పాయముగాగ సర్వసుల • భంబగు మూర్తి ధరించు భక్తవా
గ్గేయుడవైన నిన్నెపుడు • కీర్తన జేసెద రంగనా॥ 94

ఉ॥ చూపులు నన్యకామినుల • జూడగ బోవు నుశ్రోత్రముల్ దురా
లాపముల విననగ జను • లాలిత వాసన కేగుఘ్రాణముల్
ఏపగు స్పర్శగోరు త్వచ • మెప్పుడు జిహ్వ రసంబు గోరు నీ
వ్యాపక మెల్ల మాన్పి భవ • దంఘ్రిని జేర్పవె రంగ॥ 95

ఉ॥ చేయగరాని కార్యములు • చేసి దురాత్మకుడౌ నజామిళుం
డాయవసాన కాలమున • నాత్మజుపై గల మోహబుద్ధినా
రాయణయంచు బిల్వ నపు • డాతని ముక్తునిగా నొనర్చె నా
మీయసమాన నామమె య • మేయ చరిత్రము రంగనా॥96

చం॥ ప్రణుతుల బ్రోచు వేళల వి • లంబ మొకించుక నోర్వజాలడో
యనగ సుదర్శనాది మహా • దాయుధ పంచకముల్ నిరంతరం
బును కరనీరజంబుల నె • పొల్పుగ దాల్చిన రంగధామ మీ
ఘనకృపమమ్ము సంతసము • గావుత మోహన రంగ॥ 97

చం॥ పరులను జేరి వారి బహు • భంగుల సన్నుతి జేసి పొట్టకై
దిరుగుచు పాపకర్మమున • దీనత నొందునుగాని మీ పదాం
బురుహము దల్ప నేరదతి • మూఢత నా దుమనంబు నన్ను నే
తెలుగున దోసముల్ దునిమి • తిన్నగ బ్రోచెదొ రంగ॥ 98

ఉ॥ నీపరధర్మమందునవి • నిశ్చలభక్తియు తావకీయనే
వాపరతంత్రులై తగు ప్ర • పన్నులసేవయులేనివానికిన్
నీపరతత్వమందు కడు • నిర్మలభావములెట్లుగల్గు ప్ర
జ్ఞాపరిపూర్ణుడైన విలస • చ్ఛుభదాయక రంగనా॥ 99
చ॥ అనిశముయుష్మదీయచరి • తామృతపానముచేయలేకదు
ర్జనులువృథాప్రలాపములు• సల్పుచునుండెదరూరబందిపా
వనజలజాకరంబువిడి • పంకిలదుర్మలగర్తభూమి జొ
చ్చినక్రియభక్తచందన శ • చీపతివందన రంగనా॥ 100
ఉ॥ కామముహెచ్చె క్రోధమటు • గ్రమ్మెను లోభముమోహముల్ మహో
ద్దామములాయెమత్సరమ•దంబులుమిక్కుటమాయెనింద్రియ
గ్రామముగెల్వఁగావశము•గాకమిముల్ శరణంబువేడితిన్
స్వామివినాదుశత్రులను • జంపుమివేగమె రంగనా॥ 101
ఉ॥ తల్లిపితండ్రివిన్ ప్రభువు•దాతవుదైవమునీవెయంచు నా
యుల్లమునందునమ్మికొని•యుండినదాసునిశత్రువర్గముల్
పెల్లుననాక్రమించెనతి•భీతిజనింపగ జేసెవానినిన్
త్రుళ్ళడగించివేగకృప•తోననుబ్రోవవెరంగనాయకా॥102
చ॥ విషయభుజంగముల్ గఱువ• వేదనచేతభయంబునొందుచున్
విషమభవాంధకూపమున•విహ్వలబుద్ధినినున్నవాడ నీ
విషముభవత్సుధాకలిత•వీక్షణవర్షముచేహరించిని
ద్విషయముచేర్చిబ్రోవగద• వే! యెడసేయక రంగనా॥103
చ॥ అనయముమీకథాశ్రవణ• మందుచెవుల్ భవదీయనామకీ
ర్తనమునజిహ్వతావకప•దాబ్జనమస్కృతియందుమస్తకం

బునుమిముధల్చుబుద్ధియును • బొల్పగుమీమహనీయరూ
పముఁ
గనుగొనుచూడ్కులఁదృఢము•గాగయొసంగుమురంగనా॥

ఉ॥ మాయకుఁగర్తవై విగత•మాయుడవై జగదుద్భవాదికిఁ
బాయనిహేతువౌచునిర•పాయవిభూతివెలుంగుమోక్షల
క్ష్మీయుతమూర్తివైనమిము• చింతనజేసినగాకయన్యథో
పాయమునన్ దురంతభవ•బంధముబోవునెరంగనాయకా॥

ఉ॥ నీయెడభక్తిగల్గుమహ•నీయుఁడికేక్రియజేసెనేనియుఁ
శ్రీయుతమీకుప్రీతియగు•నిక్కముబంగరుగిన్నెవిప్రనా
రాయణవేశ్యకాంతకున•యంబుగనిచ్చితదీప్సితార్థముల్
సేయుటెసాక్షినీమహిమ•చిత్రమహోహరి రంగనాయకా॥

చ॥ నరహరికేశవాచ్యుతజ•నార్దనమాధవవాసుదేవ శ్రీ
ధరనరసింహశౌరివర•దాపురుషోత్తమ శ్రీనివాస శ్రీ
హరిమధుసూదనామురహ•రారఘునందన రామకృష్ణ శ్రీ
కరపరమాత్మవిష్ణుకన•కాంబరవామన రంగనాయకా॥

ఉ॥ వందనమిందిరారమణ • వందనమాశ్రిత బృందపోషణా
వందనమిందుమౌళినుత • వందనమాతతకీర్తిసంయుతా
వందనమోకృపాభరణ • వందనమద్భుతదివ్యభూషణా
వందనమబ్ధిరాట్శయన • వందనమోహరి రంగ నా॥108

చం॥ జయజయకౌస్తుభాభరణ • సర్వచరాచరభూతకారణా
జయజయపాపమోచన వి • శాలసరోరుహపత్రలోచనా
జయజయశ్రీరమారమణ • సంసరణోరుపయోధితారణా
జయజయమోక్షదాయక ల•సచ్ఛ్రుతిగేయక! రంగనా॥

చం॥ వసుమతిబొమ్మరాజుకుల • వార్ధివిధుండగుశ్రీనివాస మం
త్రిసుతుడుసంతతంబుభవ • దీయపదాశ్రయుఁడౌనృసింహుఁడిం
పెసఁగభవత్ప్రియంబుగర • చించినపద్యశతంబుసత్కృపా
రసమతిచిత్తగింపుమిప • రాకునుసేయకరంగనాయకా॥ 110

ఉ॥ మంగళమస్తుసర్వ నిగ • మవ్రతతీతతి మూలకందతే
మంగళమస్తుసంతతర • మాపరిసేవ్యపదారవిందతే
మంగళమస్తుపావన! హి • మాంశుసరస్తటభూవినోదతే
మంగళమస్తుతేనిరుప • మామృతదాయకరంగనాయకా॥

ఇది శ్రీవత్ససగోత్ర పవిత్ర వేంకమాంబా శ్రీనివాస మంత్రి
పుత్ర బొమ్మరాజు వంశ కలశ పారాశి కుముదమిత్ర
నరసింహదాస నామధేయ విరచిత శ్రీరంగ
నాయక శతకస్తోత్రము సంపూర్ణం.

శ్రీ కృ ష్ణా ర్ప ణ మ స్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

బొమ్మరాజు నరసింహదాస కృత

కీర్తనావళి.

# ఆచార్యస్తవం

కల్యాణిరాగం - ఆది

ఆచార్యులే దైవమనుచు త
చ్ఛరణము లాశ్రయించవే మనసా
నీచులైనవారి యాచింపక ఆత్మోచిత మనుచరమోక్తి
ని నమ్మి సదా॥

(1) అనువుమాలిన అహంమమతలీయాత్మకు నతివిరోధు
లనుచు
అనిశము శ్రీవైష్ణవాభిమాన మే
ఆత్మకనుపమహితమని ఆనతిచ్చిన సదా॥

(2) ఒదిగి భాగవతముఖోల్లాసముగ
దాస్యమొనరజేయు చుండుటే
అదిపురుషార్థమున కవధియనుచు
సమ్మదమున పరమార్థ మానతిచ్చు॥

(3) శ్రీశ శఠారి యతీశ వరవర మౌనీశాత్మకులగుచు
ఆశించు దాసుల నరసి రక్షింపగ
శ్రీశేషార్యులై చెలగివేంచేయు॥
సదాచార్యులే దైవమనుచు తచ్ఛరణము లాశ్రయిం
పవే మనసా

అసావేరి - ఆది

భాగవతుల శ్రీపాదపద్మసేవ ప్రార్థించవె మనసా॥
రాగద్వేషాదివిరహితులగుచునను
రాగముచే మంత్రరత్నార్థనిష్ఠులౌ॥
(1) ఈషణాత్రయ దుర్దోషములడచి
సంతోషభరితులగుచూ
శేషశయనుడగు శ్రీమన్నారాయణు
శేషత్వమున విలసిలెడు శ్రీమహా భాగ॥
(2) శమదమాది గుణసంపూర్ణులై సర్వ
సమరసభావమున
అమలినభక్తి శ్రియఃపతి చరణాబ్జ
సుమహితకైంకర్య శోభితులగు శ్రీమహా॥
(3) సతతము నవవిధ సంబంధముల లక్ష్మీపతి
ననుభవించుచునూ
అతులితమతిచే నన్యార్హులగుచును
వితతపారతంత్ర్య విభవులైన శ్రీమహా॥
(4) ధన్యులై శ్రీరంగ ధాముని పరభక్తి మాన్యులగుచు
నెప్పుడూ। అన్యోన్యము నైచ్యానుసంధాన
సౌజన్యముచే భాగ్యసంపన్నులగు శ్రీమహా॥
(5) చరమోపాయ నిర్భరులగుచును పూర్ణ
పరమభక్తులగుచూ। ధరణిలో దాసానుదా
సుడైన లక్ష్మీనరసింహదాసుని యరసి బ్రోచు శ్రీమహా॥

కాంభోది - జంపె.

శ్రీరంగనాథమీా, శ్రీపాదసన్నిధికి చేరు

యెన్నడుగల్గునో॥
ఘోర సంసారాంధ కూపంబులోజిక్కి
భూరిదుఃఖములచే పూర్ణుండనగు నాకు॥
(1) పంచేంద్రియములచే వంచితుడనై విషయ
పంచకములనుభవించి
సంచితంబగు కర్మచయము చేపట్టువడి
చంచలాత్ముండనగుచు॥
ఎంచశక్యముగాని యెల్లయోనులను
జన్మించుచును సన్మార్గ మెరుగనేరనినాకు॥
(2) ఆలుబిడ్డలును చుట్టాలు మిత్రులును
కడు మేలైనగృహాభూములు
చాలధనధాన్య సంచయములీ
దేహములుసతమనుచు నుప్పొంగుచు॥
కాలమెరుగగలేక కామాదిశత్రువుల
పాలబడుచును మోహపరవశుడనగునాకు
(3) అనుదినంబుదరపోషణకొరకునై గ్రామ
శునకంబువలె దిరుగుచు
ధనికులనుజేరి కడుదైన్యవృత్తినివారి
ననుసరింపుచు తిరుగుచు॥
ఘనతరాజ్ఞాన సాగరమందు దరిగనక
మునుగుచును సతతంబు మొదలెరుంగనినాకు॥
(4) వాసిగాయిహాలోక పరలోకములమీది
నాసలన్నియును విడచి
ఆసరసిజాసనాద్యైశ్వర్య కైవల్య

వాసనారుచులు గడచి
దాసానుదాసుడన దగిన శ్రీనరసింహ
దాసుడనుపేరు సార్థకముజెందు
టకునై శ్రీరంగ॥

మోహన - ఆట.

గోపాలనీకన్న గొప్పవేల్పులేరి గోవర్ధనోద్ధారీ
పాపసంహార యాఘాలాక్షుడు మీా।
శ్రీపాదతీర్థము శిరమునధరియించె॥ గో॥

(1) సకలదేవతానికరములకు తన
స్వల్పకటాక్షమున।
ప్రకటైశ్వర్యసంపదలొసగెడు లక్ష్మి
అకలంకమతినినీయంఘ్రులాశ్రయించె॥

(2) దేవదేవలోకావళి సృజియించు
నావిధాతమున్నె!
భావింపనీనాభి పంకజమునబుట్టి
ప్రావీణ్యమునొందె పరమపురుష శ్రీ॥

(3) కరివరుమొఱవిని సురలుతమకు
పరాత్పర భావములేదని।
యరసియూరకున్న నఖిలాంతరాత్మవై
పరగునీవేవచ్చి కరినిగాచితివట॥

(4) సారథివై ధనంజయునకు వేదాంత
సారముబోధింపుచు।
ఆయాధినకలవేదాంతవేద్యుడ
శ్రీమన్నారాయణుడ నేననుచుదెల్పితివట॥

(5) పరతత్వవిజ్ఞాన పరమానంద నిర్భ
రులయినవ్యాసాదులు ।
వరయోగిహృద్ధ్యేయ పరవాసుదేవుడ ।
వరయనీవేయని ఆనతిచ్చిరట॥

(6) దాసజనులఁబ్రోవదలచి శ్రీ
శేషాద్రి । వాసుడవై వెలసి ।
ఆసించునరసింహదాసునేలు
శ్రీనివాసనిడుమనూరి వాసకేశవరూప॥

శ్రీరాగం - ఆది.

శ్రీనివాసనీ సేవగోరితిని
గానలోలయేరా కాచిబ్రోవరారా॥

(1) నన్నుఁబ్రోవవేమి అన్నాభారమేమి
సన్నుతింతుసామీ పన్నగారిగామీ॥

(2) దిక్కువేరెలేక మ్రొక్కితేపరాక
మక్కువెందుబోక చిక్కితింతేగాక॥

(3) చారుగాత్రశౌరి, శంఖచక్రధారి
భూరినిడుమనూరి పురికేశవమురారి॥

(4) భూరిచిద్విలాస భోగిశైలవాస
నారసింహదాసా నందమందహాసా॥

మధ్యమావతి - (ఆనందభైరవి) ఆది

శ్రీరఘునందన శ్రితమునిచందన శ్రిజితసంక్రందనా॥
మారుతాత్మజానంద మహితసద్గుణ బృంద॥

(1) నేరమెంచకుదేవా భారమానన్నుఁబ్రోవ
వేరుజేసెదవేరా ఘోరకల్మషదూర ॥శ్రీ॥

(2) ఇందిరేశానీతోటి అందరయ్యారాసాటి
అందమునీరా యానందమొసగరారా ॥శ్రీ॥
(3) రామశ్రీభద్రశైల ధామ తారకనామా
శ్రీమహోన్నతపరం ధామసంపూర్ణకామ ॥శ్రీ॥
(4) ధారుణి నరసింహ దాసు నేలగరారా
భూరిశ్రీనిడుమా నూరి కేశవాకారా ॥శ్రీ॥

వంతవరాళి - త్రిపుట.

చక్కనిరాజమన్నారు సామియింతచలమేమీ
ఎక్కడకేగితివో నా అక్కరతీర్చరావేమి।
(1) ఎందుకుఇంతకోపము సుందరయేమినేరము
చందురుగేరునీమోము చందముకనులజూపుము
(2) మోహించితినిన్ను జేర ముచ్చటైనఆడవేరా
మోహనాకారయెంతో నిర్మోహివైతివిరాధీర
(3) నిన్నడబాసియీవేళ వెన్నడాతాళగజాల
కన్నడజేసెదవేలా చిన్నిముద్దులగోపాల॥
(4) భూరిశ్రీనిడుమనూరిపురీకేశవాశౌరి
వారిజాక్షమురారిశ్రీరమామనోవిహారీ
(5) వరదశ్రీశేషాద్రివాసా నిరుపమానందవిలాస
పరమపురుషశ్రీనివాసా పాలితానరసింహదాస॥

జంఝూటి - రూపకం.

నందనందనరారశరదిందుసౌందర్యవధనా।
బృందావనవిహారణగో బృందావన నిపుణా॥
(1) మారకోటిసుందరా కారానీరదశరీరా
మేరుధీరవారిధిగంభీర జారచోర

(2) రాసకేళిలోలా శ్రీరాధాహృదయానుకూల
భాసురహేమచేలా గోపాలబాలలీలా
(3) ఘోరదురితహారి కంసారిమురవిదారీ।
భూరినిడమనూరిపురవిహారీ కేశవశౌరి॥

కల్యాణి - ఆది.

పాలించవేనను పరమకల్యాణీ నీలనీరదవేణీ
లీలారవిందపాణి పాలితగీర్వాణి జనని॥
(1) శ్రీరంగనాథురాణి శ్రితజనసంత్రాణి
చారుసైకతశ్రోణి కీరవాణిరుక్మిణీ॥ జనని॥
(2) దురితౌఘహారిణీ సరసవిహారిణీ
పురుషకారకారిణీ హరిమనోహారిణీ॥ జనని॥
(3) వరనిడుమనూరి పురీసంస్థాయినీ
వరదశ్రీకేశవ స్వావ్యనపాయినీ॥ జననీ॥
(4) వరవెంకటాచల వాసహాయినీ
నరసింహదాసా నందప్రదాయినీ॥ జననీ॥

మంగళహారతి.

సరసిజాసనాది సురలెల్లప్రార్థింప
ధరణిలోవసుదేవ తనయుడవై
వరదేవకీగర్భ వాసముననుబుట్టి
అరుదుగ వ్రేపల్లెకరిగినశ్రీకృష్ణా॥ మంగళం మంగళం॥
(1) అలనందసుతుడవై యలరిపూతనాది
బలురక్కసులనెల్ల బరిభవించిదుంచి
చెలగివ్రేతల యిండ్లగలవెన్నపాల్ పెరుగు
మ్రుచ్చిలించిన గోపాలశ్రీకృష్ణా॥ మంగళం॥

(2) ఠీవిమీర మురళీరావముజెలఁగఁ
భావజకోటి శోభనమూర్తివై
పావనమైన బృందావన వీథుల
గోవులమేపిన గోపాలశ్రీకృష్ణా॥ మంగళం॥

(3) భాసమాన సువిలాస గానకళా
భ్యాసపాదవిన్యాసము లలరఁగ
వాసిమీరఁగ గోపికాసతులనుగూడి
రాసక్రీడసల్పు రాజగోపాల॥ మంగళం॥

(4) గరిమతోడ మధురకరిగి కంసాదుల
దరిగి ద్వారవతీపురము జేరిమీరి
స్థిరముగ రుక్మిణీదేవి మొదలగు అష్ట
తరుణులవరియించి దొరవైన శ్రీకృష్ణా మం॥

(5) విరివిగపదియారు వేలసుందరుల
పరిణయించి నిత్యపరిపూర్ణుడవై
వగనిడుమానూరిపురి శ్రీకేశవాకృతి
ధరుడవై వెలసిన తాండవశ్రీకృష్ణా మం॥

# వివేక వర్ధనీ గ్రంథమండలి, బాపట్ల.

సంవత్సరమునకు నాల్గు గ్రంథములు ప్రకటింపబడును. ముందుగ డబ్బునీయ నక్కరలేదు. 0-4-0 ప్రవేశ రుసుము చెల్లించి శాశ్వత చందాదారులుగా చేరవలెను. ప్రతి గ్రంథము దాని వెలకు వి. పి. గా చందాదారులకు బంపబడును. చందాదారులకు పోస్టేజీ తగులదు. ప్రతి పుస్తకమును చాల అందముగను, పఠనీయముగను వుండును. చందాదారులకు మిక్కిలి సరసమగు వెలలకు గ్రంథములు లభించును.



రాబోవు గ్రంథము.

(తృతీయ కుసుమము)

## వీర మాత

# కుంతీ మహా దేవి

రెండుమాసములలో వెలువడును. ఇందు కుంతీమహాదేవియొక్క బుద్ధినిపుణత, ఆమె తనపుత్రులకు చెప్పిన రాజ్యాంగవిషయములగు సందేశములు, ఆమెయొక్క ధైర్య గాంభీర్యాది విశేషములు, పరోపకారపారీణత మున్నగునవి చక్కగ నభివర్ణింపబడినవి. అపూర్వగ్రంథము. సలక్షణ లలితపద భరితము. నూత్న భావ విలసితము. అందమగు ముద్రణము, కారుచవుక.

సంపాదకుడు,

వివేక వర్ధనీ గ్రంథమండలి, బాపట్ల, (గుంటూరుజిల్లా).

